కవిత దీపమంత - వెలుగు లోకమంతా...!

# వెలుగు రాగాలు

డా॥ జి. వి. పూర్ణచందు

మాధురీ ప్రచురణలు
ఎమెస్కో

కవితా సంపుటి
**వెలుగు రాగాలు**
**డా॥ జి.వి. పూర్ణచందు**
సుశ్రుత ఆయుర్వేదిక్ స్పెషాలిటీ హాస్పిటల్
బకింగ్‌హాం పేట పోస్టాఫీసు ఎదురు
గవర్నర్ పేట, విజయవాడ-520 002
సెల్ : 9440172642

ముద్రణ : మార్చి, 2010

మూల్యం : **40/-**

ముఖచిత్రం : శ్రీ శీలావీ
రాగరేఖలు : శ్రీ వి.యస్.పాణి
డి.టి.పి. : సుధారాణి.పి

ప్రచురణ
**మాధురీ ప్రచురణలు**
సిద్దార్థ నగర్ 5వ లైను,
విజయవాడ -520 010.

- ముఖ చిత్రాలిచ్చిన సంక్షిప్తశబ్ద చిత్రకవి, చిత్రకారులు 'శీలావీర్రాజుగారి'కీ
- ఆపరేషన్ అయి ఆస్పత్రిలో వుండికూడా వెలుగురాగాలకు రాగరేఖలు గీసిన ఆత్మీయ చిత్రకారులు 'పాణి'గారికి
- ఆముఖాలిచ్చిన గురువు విహారిగారికీ, మినీ కవితోద్యమ సహచరుడు డా॥ రావి రంగారావుగారికీ, కృష్ణాజిల్లా రచయితల సంఘం సహచరుడు డా॥ గుమ్మా సాంబశివరావుగారికీ
- ఎమెస్కో 'లక్ష్మి' గారికీ
- రచయిత్రి భమిడిపాటి బాలాత్రిపురసుందరిగారికీ, కవి, హిందీ పండితుడు డా॥ వెన్నా వల్లభరావుగారికీ మనసారా మెప్పులు చెప్పుకొంటున్నాను

**డా॥ జి.వి.పూర్ణచందు**

ఈ పుస్తకం
సూక్ష్మదర్శిని...

కనిపించే వాటి వెనక నక్కిన
కనిపించని ఎన్నింటినో
దుర్భిణీ వేసి చూపిస్తోంది!

ఈ పుస్తకం
దూరదర్శిని...

గుండెలోతుల్లో దాగిన
ఆర్తిని
ఆర్ద్రంగా స్పృశిస్తోంది!

ఈ పుస్తకం
ఆత్మదర్శిని...

వెలుగురాగాలకు
తెలుగు నాదాలు కూర్చి
జీవగీతాలందిస్తోంది!

ఈ పుస్తకం
నాకెంతో ఇష్టం...

అమ్మలాంటి అమ్మ
చలసాని వసుమతమ్మ
మరీ ఇష్టం...

అందుకే-
ఈ పుస్తకం
ఆమెకు అంకితం!!!

## ఘనమైన భావ చిత్రాల ధ్వని...
## గుణమైన కవితా పయస్విని!

కవిత్వంలో వస్తురూపాల ప్రాధాన్యత తెలిసినకవి డా॥పూర్ణచందు. మినీ కవితోద్యమంలో గట్టి భాగస్వామి. లెక్కకు మించిన మినీకవితల్ని రాయటమేకాక, వాటికి చిత్రాల్నికూడా వేసి, తెలుగునాట ప్రదర్శనలు నిర్వహించి, ఆ ఉద్యమానికొక ఊపుతెచ్చినవాడు. "కాంతి స్వప్న" దీర్ఘకావ్యం ద్వారా... కవిత్వాభిమానులకు గట్టిగింజల్ని అందించినవాడు.

విడిగా...

అతను భాషోద్యమ కార్యకర్త. 'తెలుగే ప్రాచీనం' అని ఎలుగెత్తి చాటిన పరిశోధకుడు. 'నైలునుంచి కృష్ణదాకా" అనే అతని పరిశోధనాగ్రంథాన్ని ద్రావిడ విశ్వవిద్యాలయం ప్రచురించి, సాధికారికతనిచ్చింది.

డా॥ పూర్ణచందు సాహిత్య కార్యక్రమ నిర్వహణాదక్షుడు కూడా! గుత్తికొండ సుబ్బారావుతో కలిసి ప్రపంచ తెలుగు రచయితల మహాసభల్లాంటివెన్నో నిర్వహించినవాడు.

"తరతరాల తెలుగురుచులు" వంటి తెలుగువారి ఆహార విహార వ్యవహార సంస్కృతీ సంప్రదాయాల విజ్ఞతకు అద్దంపట్టే అనేక సూచికల్ని అనేక ప్రక్రియా రూపాలలో గ్రంథాలు గ్రంథాలుగా జాతికందిస్తున్న రచనాచణుడు. ఇంచు మించుగా 100 పుస్తకాలు వెలువరించినవాడు. ఏ తెలుగు వెలుగు కిరణం గురించయినా సాధికారంగా చెప్పగల అతి తక్కువమంది సాహితీకారుల్లో ఒకడుగా గణుతికెక్కినవాడు.

ఇవాళ– మళ్ళీ ఇన్నాళ్ళకి డా॥ పూర్ణచందు 'వెలుగు రాగాలు' పేరుతో కవితాసంపుటిని తెస్తున్నాడు. శుభం.

వస్తువుదృష్ట్యా అనంత వైవిధ్యం ఈనాటికవుల భావధారలో ఎటూ గిరికీలు కొడుతూనే వుంది. జీవనం, జీవిక, జీవన తాత్త్వికత ప్రశ్నిస్తున్న ఎన్నో విలోమాలు వస్తువుని ఆశ్రయించుకుని పూర్ణచందు కవిత్వంలో బహిర్గతమౌతున్నాయి.

పరిణామ క్రమంలో కవిత్వం చాలా వాదాల్నీ, నాదాల్నీ, నినాదాల్నీ తనలో మిళితం చేసుకుని, 'సామాజిక స్పృహ' అనే చట్రంలో ఇరుక్కుపోయి కడకు

మళ్ళీ వ్యక్తి చైతన్యం, మనిషి స్వేచ్ఛతో సమస్త శక్తుల్నీ సాధించగలడనీ, సాధించ నున్నాడనీ ఆకాంక్షించే స్థితికి చేరుకుంది. ఈనాడు కవితా వస్తువు మనిషిచుట్టూనూ, సమాజం చుట్టూనూ, ఈ రెంటికీ మధ్య వ్యుత్పన్నమయ్యే సంఘర్షణ చుట్టూనూ పరిభ్రమిస్తోంది. స్వరూపం దృష్ట్యా పద్యం, వచనకవిత, మినీకవిత, హైకూలు, గజళ్ళు, సైకూలు, నానీలు, రెక్కలు, నానోలు... ఇలా ఒకటి రెండుమూడు అక్షరాల్లో ఎన్నెన్ని పేర్లు coin చేయగలమో అన్నిపేర్లతో కాగితాల కెక్కుతోంది.

కవిత్వ స్వరూపంగురించి మాట్లాడేటప్పుడు- నాకు కొన్ని అభిప్రాయా లున్నాయి. హేతువు, బుద్ధి, సృజనాత్మకత ఇలాంటివన్నీ అభివ్యక్తిలో అవ్యాజంగానే గోచరించాలి... అనేది నాకోరిక. అలాగే, పాఠక సహృదయుడి సంస్కారోన్నతికి దోహదం చేస్తూ, అనిర్వచనీయతని అతనికే వదిలేయాలనేది నాకు వాంఛితం. ఈ పదార్థాలు పూర్ణచందుకీ యిష్టమైనవే అని అతని కవిత్వం తెలుపుతోంది. అందుకనే రసస్ఫూర్తిని కలిగించి, పఠితలో ఆనందం - అనుభూతి- అనిర్వచనీయత అనే Continnum ని ప్రోది చేసే కవిత్వ శిల్పమూ, శైలీ అతని రచనలో ద్యోతక మవుతున్నాయి. ఆ సొబగులన్నిటినీ చూపుతూ పోలేనుగానీ, ఒకటిరెండు ఉదాహరణల్ని పంచుకుంటాను.

మొదటి ఖండికలో మొదటి చరణమే చూడండి.

"ఆలోచనల / ఏకులు వడికి / వెన్నెల దారాలను / వేకువ ఆకాశం / రంగుల్లో తడిపి / లోకానికి / వెలుతురు కవిత / రాస్తున్నాను..." భావ చిత్రావిష్కరణం జరగాలంటే ఇలా ఉపమారూపకాల్ని ఆశ్రయించాల్సిందే కవి.

"Imagery begets pleasure" శక్తివంతమైన భావాలు అభివ్యక్తి తీవ్రతనుంచీ కవిత్వంగా రూపాంతరీకరణం జరుగుతాయి.

ఉత్తమ కవి పలుకులో "ముంగిట ముత్యంలా / ఇంట్లో / ఇంటర్నెట్టొక / వింతవల / క'రెంటొ'క్కటే ఖర్చు.../ వెంటాడిన కొద్దీ / వేలపేజీల సమాచారం... / భూగోళం / అరచేతిలో అమరినట్టు" - ఈ కవిత చదవగానే పాఠకుడు ఒక mood లోకి ప్రవేశిస్తాడు. ఇంటర్నెట్‌ని Best source of information చేసుకోవడం ఎలా? అనే ఆలోచనా ప్రేరకమవుతుందీ ఖండిక. అతని చైతన్య స్రవంతిలో... అనేకమైన అంశాల సమాచారం- ఇంతవరకూ తెలియనిది 'వరణం' లోనిది

స్పృహకొస్తుంది. ఇదీ ఉత్తమకవి- శబ్దానికీ దృశ్యానికీ ఒక అనుసంధానాన్ని కూర్చే పద్ధతి. ఇలాంటి కవితలు చాలా వున్నాయీ సంపుటిలో.

తాత - తండ్రీ - మనవడు - వీళ్ళని చిన్నగీత, పెద్దగీతల్లోకి దించిన చమత్కారం బాగుంది. అధిక్షేపం - ఒక వక్రోక్తి. అదొక అలంకారం. 'వాక్యం రసాత్మకం కావ్యమ్' కావలసి వచ్చినప్పుడు అద్భుతంగా పండుతుందది. అందుకే, ఒక కవితలో పూర్ణచంద్ అన్నాడు. 'పాటకు / పాటలో మాటకు / 'కాపీ' / రైటే!' అద్భుతమైన ముక్తాయింపు!

అలాగే, "మంచం" సహజాత లక్షణాలు చెప్పిన గొప్ప తాత్త్విక కవిత. "పుట్టాడనగానే / మంచంమీదకు / చేర్చేస్తారు... / మరణిస్తున్నాడనగానే / మంచంమీంచి / దించేస్తారు... / పుట్టుకకీ చావుకీ / మధ్య / రహదారి... / ఈ మంచం / అలంకరించుకొంటే / శోభనం /. ఈ చివరిరెండు పంక్తులు "అలంకరించుకుంటే / శోభనం / అనేవి మనిషి జీవనగమనానికి పథనిర్దేశం కూడా చేస్తోన్నాయి.

"నిన్నటి వరకూ / బతుకు / పూర్వజన్మ సుకృతం / రేపటినించీ / మరణం- మళ్ళీ జన్మకు పునాది! / నేడనేది నాదనేలోగా / కాలకింకరులు / రేపట్లోకి తోలేస్తారు! / పుట్టుక / చావుల / సంధికాలంలోనే / సంధించాలీ / ఆయుధాన్ని" పద్యం చదవగానే ఒక జన బీభత్సం, ఒక మరణ విన్యాసం, మన భావనాకాశంలో ఉరుముల్నీ మెరుపుల్నీ సంధిస్తుంది. జీవన తాత్త్వికతా సందేశాలేవో ఆలోచనా ప్రేరకాలవుతాయి.

"కొండ కొప్పులో / బంతిపువ్వు / సూరీడు..." అనే చక్కని రూప చిత్రాన్ని ఇచ్చిన కవితలో పూర్ణచందు తన ఊరిమీద అభిమానంతోపాటు 'భాషోద్యమం' పట్ల తన నిబద్ధతని కూడా చాటుకున్నాడు.

వైవిధ్య భరితంగా ఇన్ని ఇన్ని భావచిత్రాలున్న పుస్తకంలోని అన్నికవితల్నీ ఉదహరించి విషయసూచిక పట్టీని ముందుమాటలో కెక్కించటం భావ్యంకాదు. కవితాప్రియులు చిత్తగించండి.

డా॥ పూర్ణచందుకి తనదైన శైలి వుంది. మినీకవిత మీద పట్టువుంది. వ్యక్తీకరణంలో అనంత గాంభీర్యంతో పాటు, అత్యంతమైన సుళువూ వుంది. ఆ గాంభీర్యతని పట్టుకోవటానికి - నింపాదిగా చదివే తీరుబడి కావాలి... చదువరికి!

వర్తమానంలో కవిత్వం ఒక 'ఫీలింగ్' ఆశ్రితంగా పాతిక ముప్పయి పంక్తుల్లో, కొన్నిటియెడల ఇంకొంచెం పెద్దదిగా సాగుతోంది. చాలా కవితలు ఈ ప్రాసెస్‌లో స్పష్టత తగ్గిపోయి, చదివించే గుణాన్ని కోల్పోతున్నాయి. లబ్ధ ప్రతిష్టులైన కొందరు కవుల కవిత్వానికీ ఈ ఇబ్బంది తప్పటంలేదు. ఆ దృష్ట్యా- చిన్న కవితలకి ఆదరణ హెచ్చుతున్నది. "కవిత దీపమంత - వెలుగు లోకమంతా..." అని పూర్ణచందు తన వెలుగు రాగాలకు ఒక Tag నిచ్చి తన మనసులోని భావాన్ని చెప్పకయే చెప్పాడు. ఒక Flash ని, ఒక Brilliance ని పాఠకలోకం ఆశిస్తున్నట్టుంది. "లోకో భిన్నరుచిః"!

డా॥ పూర్ణచందు, మనిషి జీవితపు విభిన్న పార్శ్వాల్నీ, మనన ధారనీ, మనుగడ చాలునీ తన కవిత్వంలో వ్యక్తీకరిస్తున్నాడు. తన ఆలోచనలు మరికొందరికి ప్రేరకం కావాలనీ, చోదకం కావాలనీ ఆశిస్తున్నాడు. ఆ ఆశకి దర్పణం ఈ పుస్తకం. చదివి ఆనందించండి. అనుభూతి పారవశ్యాన్ని పొందండి. అనిర్వచనీయ తతో ఆలోచన సాగించండి. మీకూ, కవికీ కూడా శుభాకాంక్షలు. అభినందనలు.

హైదరాబాదు
ఉగాది 2010 **-విహారి**

## "మనసంతా వెలుగులు నింపే కవితా దీపాలు"

మినీ కవిత అనగానే నాకు గుర్తువచ్చేది "ఆంధ్రజ్యోతి" సచిత్ర వారపత్రిక, సంపాదకులు పురాణం సుబ్రహ్మణ్యం శర్మ. ఆయన అందులో మంచి మినీ కవితలకు ఆరోజుల్లో అవకాశం కల్పించారు. ఆ పత్రికలోనే ఎమ్వీయల్ "యువజ్యోతి" శీర్షిక నిర్వహిస్తూ మంచి మినీ కవితలు ప్రచురిస్తూ వుండేవారు. వారిద్దరినీ అభిమానించినట్లే ఇప్పటికీ నేను బాగా అభిమానించింది, అభిమానించేదీ మినీ కవిత ప్రచారం చేసినందుకు పూర్ణచందునే. ఇదంతా 30 ఏళ్ళ క్రితంనాటి సంగతి!

"ఆంధ్రజ్యోతి" వారపత్రిక ప్రభావంతో కొన్ని ఇతర పత్రికలు కూడా చాలా చిక్కని చక్కని మినీకవితలు ప్రచురించాయి. 1980 ప్రాంతానికి మినీకవిత ఒక ప్రత్యేక రచనా శిల్పంగా ఒక పదునైన ఆయుధంగా నిలదొక్కుకొనటం నేను గమనించాను. ఎందరో యువకవులు, కొత్తకవులు, మంచి మినీకవితలు రాయటం మొదలుపెట్టారు. మినీకవిత ఒక ప్రత్యేక ప్రక్రియగా విశ్లేషిస్తూ నేను "భారతి" 1980 ఏప్రిల్ సంచికలో ఒక వ్యాసం రాశాను. అది సాహిత్యలోకంలో పెద్దచర్చకు దారితీసింది.

మినీకవితను ప్రజలలోనికి తీసుకెళ్ళటానికి చిత్రాలు జోడించి వివిధ ప్రాంతాలలో ప్రదర్శనలు ఏర్పాటు చేసి మినీకవిత ప్రక్రియ ఒక ఉద్యమంలాగా జనంలోకి దూసుకుపోవాలనే ఉద్దేశంతో ఆచరణలో పెట్టినవాడు, జి.వి. పూర్ణచందు. మినీకవిత ప్రచారం గురించి మా భావాలు కలిశాయి. పూర్ణచందు "ఆంధ్రజ్యోతి" వారపత్రిక, విశాలాంధ్ర దినపత్రిక కార్యాలయాలలో కూర్చోని మంచి మినీకవితల్ని వెలికితీసి, వాటికి తగినబొమ్మలు వేసి ఆంధ్రదేశంలో ప్రదర్శనలు ఏర్పాటు చేశాడు. ప్రదర్శన సందర్భంగా జరిగే సభలో నేను మినీకవిత గురించి, దాని ప్రత్యేక శిల్పం గురించి, మంచి మినీకవితలలో కన్పిస్తున్న లక్షణాలను గురించి సోదాహరణంగా ఉపన్యసించాను. అలా మేమిద్దరం ఆంధ్రదేశంలో అనేక సభలలో మినీకవిత ప్రచారం కలిసి చేశాము. నన్ను, పూర్ణచందును సాహిత్య విమర్శకులు "కృష్ణార్జును"లని పిలిచేవారు.

నేను 1981లో 'గుడ్‌మార్నింగ్' అనే కవితల సంపుటిని ప్రచురించాను. అందులోని కవితలకు పూర్ణచందు బొమ్మలు వేశాడు. కొన్ని కవితలకన్న

పూర్ణచందు వేసిన కొన్ని బొమ్మలకే మంచిపేరు వచ్చింది. మినీకవితలో కవి చెప్పిన భావానికి "extension" గా ఉండాలనే విశేష నియమం పెట్టుకొని పూర్ణచందు బొమ్మలు వేశాడు. “ముఖచిత్రం” కూడా ఎంతో భావస్ఫోరకంగా వేశాడు. మినీ కవితను ప్రచారం చేస్తున్న వాళ్ళనెవరినైనా నేను బాగా ప్రేమిస్తాను. అలాంటివారిలో నేను గాఢంగా ప్రేమించిన వ్యక్తి పూర్ణచందు. అందుకే “గుడ్‌మార్నింగ్” మినీ కవితల సంపుటిని పూర్ణచందుకే అంకితం ఇచ్చాను. అందులోని “గుడ్‌మార్నింగ్” అనే కవిత పాఠకులకు బాగా నచ్చి నన్ను “గుడ్‌మార్నింగ్ రంగారావు” అని పిలిచేవారు. పూర్ణచందు, నేను కలుసు కున్నప్పుడల్లా “గుడ్‌మార్నింగ్” చెప్పుకోవటం ఇప్పటికీ మాకు అలవాటు.

కొన్నాళ్ళు మినీకవిత ప్రదర్శనలు దేశమంతటా చాలా ఉత్సాహంగా నిర్వహించిన పూర్ణచందు తరువాత వైద్యవృత్తిలో పూర్తిగా మునిగిపోయాడు. మళ్లా చాలాకాలం తర్వాత తెలుగు భాషాభిమానిగా, సాంస్కృతిక ప్రేమికుడిగా, తెలుగు పరిశోధకుడిగా బాగా తేలివచ్చాడు. ఇప్పుడు నేను బాగా సంతోషిస్తున్నాను. ఇవ్వాళ ‘‘వెలుగు రాగాలు’’ కవితల సంపుటిని ప్రచురిస్తున్నందుకు మరీ సంతోషిస్తున్నాను.

మినీ కవితలకే పదాలని, పాదాలని నియమాలతో కొందరుకవులు సొంత ప్రక్రియల్ని ప్రారంభిస్తున్న సందర్భంలో ఎలాంటి సంకెళ్ళు లేని కవితలు పూర్ణచందు ఇప్పుడు ప్రచురిస్తున్నాడు.

కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రధాన కార్యదర్శిగా, రచయితగా, కవిగా, భాషాచారిత్రక పరిశోధకుడిగా పూర్ణచందు కృషిని ప్రశంసిస్తూనే “మినీ కవిత ప్రచారం”కూడా మరచిపోవద్దని గుర్తుచేస్తున్నాను.

పూర్ణచందు కవితల సంపుటి గురించి నేను ఎంతరాసినా అది తక్కువే. అందుకే మచ్చుకు ఒక కవిత ఉదహరిస్తాను.

“దీపం లేక
ఇల్లుపాడుబడ్డట్టు...
చంద్రుడు రాక
ఆకాశం నల్లబడ్డట్టు...
నైవేద్యం లేక
గుడి పాడుబడ్డట్టు...

పేపర్లో పేర్రాని రోజు
నాయకుడి
గుండె!
బావురుమంటుంది!"

మినీకవిత ఒక రవ్వకాదు, ఒక మెరుపుకాదు, ఒక మిణుగురు పురుగు కాదు. చిన్నదైనా నిలకడగా నిలిచి గుండెల్లోకి వెళ్లి వామనుడు విశ్వరూపం ధరించినట్లు పాఠకుడి మనస్సునంతా వెలిగిస్తుంది. పై కవిత చదివిన పాఠకుడు కవిత్వం వల్ల కలిగే ఆనంద చైతన్యాలనే రెండు ప్రయోజనాలను ఏకకాలంలో పొందగలుగుతాడు.

పూర్ణచంద్ కవితల సంపుటి పేరు "వెలుగు రాగాలు." దీనికి అనుబంధ నామం "కవిత దీపమంత - వెలుగు లోకమంతా!" ఈ అనుబంధనామం మినీకవితలకు బాగా వర్తిస్తుంది. ఈ పుస్తకంలో గుర్తుపెట్టుకోదగిన మంచి "మినీ కవిత"లలో మచ్చుకు కొన్ని.

"ఊహల
ప్రమిదలో
ఆశల సముద్రం
నింపి
అనుభవాల
దీపం వెలిగిస్తున్నా...
అనుభూతులదే
వెలుగంతా!"

మరో మినీ కవిత-

"మనసు
గంధపు చెక్క!
మనిషి...
రాయైనా
గంధపు సాన!

స్నేహహస్తాలతో
అరగదీస్తేనే
లోకానికి
పరిమళం!"

పూర్ణచంద్ వ్యక్తిత్వం సరళం. మనిషి కోప్పడటం నేను చూడలేదు. ఇతరులు ఎంత పెద్దబాధపెట్టినా కడుపులో నలిగిపోతాడేమో కాని, వాక్పారుష్యం ప్రదర్శించడు. అందుకే పూర్ణచంద్ కవిత్వంలో కూడా నిప్పులు కక్కే పదజాలా లుండవు. మంటలు పెంచే ఆలోచనలుండవు. మనిషి మనసును సున్నితంగా తాకే భావాలుంటాయి. మనసును సుకుమారంగా ఆలోచింపజేసి నిర్దిష్ట కార్యాచరణవైపుకు నడిపిస్తాయి.

ఈ కవిత చూడండి.

"కొండ కొప్పులో
బంతిపువ్వు సూరీడు...
పారాణి కాళ్ళమీద
కుంకుమరేఖ కృష్ణమ్మ...
వయ్యారం నడుం మీద
వంకీల వడ్డాణం ప్రకాశం బ్యారేజ్,
కొండచుట్టూ అల్లుకున్న
ఆదిశేషుడు బెజవాడ,
ఫణి పడగమీద
వెలుగులీనే మణి 'భాషోద్యమం'
తెలుగునేలంతా పరుచుకుంటూ..."

విజయవాడ నుంచి పరుచుకుంటున్న తెలుగు భాషోద్యమం వెలుగులు మనకు గుర్తుచేస్తున్నాడు. విజయవాడనుండి తెలుగు భాషోద్యమ కాంతులు పంచుతున్నవారు డా॥ పూర్ణచందు, అలాగే, తెలుగు భాషోద్యమ నాయకులు "నడుస్తున్న చరిత్ర" సంపాదకులు డా॥ సామల రమేష్‌బాబు. తెలుగు భాషోద్యమం

కోసం పాటుపడుతున్న కృష్ణాజిల్లా రచయితల సంఘం కార్యస్థానం విజయవాడ. ఈ సంస్థకు ప్రధాన కార్యదర్శి డా॥ జి.వి. పూర్ణచందు. ఇంకా ఎందరో భాషోద్యమ కారులకు పుట్టినిల్లు, కార్యక్షేత్రం విజయవాడ.

మరో మంచి మినీకవిత.

"గుప్పిట తెరిస్తే
రహస్యం బయట పడుతుంది,
గుప్పిట బిగిస్తే
బ్రహ్మాండం బద్దలవుతుంది,
చేతికి సంకెళ్ళు అందుకే"

వాస్తవాలను చాలామంది అర్థం చేసుకోలేరు, జీర్ణించుకోలేరు. లోకంతీరు అలా మారిపోతూవుంది. లోకాన్ని మారుద్దామని కొద్దిమంది ప్రయత్నించినా అందుకు ప్రతిఘటన ఎదురవుతుంది. వ్యవస్థను మార్చటం చాలా కష్టసాధ్యమయిన పని. అయినా పట్టుదల గలవారు వదిలిపెట్టరు. చాలా అద్భుతమైన మినీ కవిత ఇది.

పూర్ణచందు కవితల్ని ఇలా ఆలోచించి అర్థం చేసుకోవాల్సినవి చాలా వున్నాయి. అందుకు పాఠకులు సిద్ధంగా వున్నారు. మాకున్న స్నేహబంధం కారణంగా పూర్ణచంద్ కవిత్వం ప్రచురిస్తున్న సందర్భంలో ఈ నాలుగుమాటలు రాశాను. పూర్ణచంద్‌కు శుభాభినందనలతో

**డా॥ రావి రంగారావు.**

# వెలుగు రాగాల పూర్ణచంద్రుని దీప కవిత!

కవిగా, చిత్రకారునిగా, మినీ కవితోద్యమ ప్రచారకునిగా భాషా పరిశోధకునిగా, కార్యకర్తగా తెలుగునాట ప్రసిద్ధి పొందిన డాక్టర్ జి.వి. పూర్ణచందు "కలం దీపం" నుంచి వెలుగు రాగాలు వెలువడుతున్నాయి. కవికి ప్రకృతి పరిశీలనం, బహుగ్రంథ పరిచయం, విశిష్ట భావనాశక్తి వుంటే కవితలు పుష్టిమంతంగా, కొత్తకాంతులతో ప్రకాశిస్తాయని చెప్పటానికి 'వెలుగు రాగాలు' ప్రత్యక్ష సాక్ష్యం.

పూర్వకవుల స్ఫూర్తి పొందుతూనే, కవి తన దారిని తాను నిర్మించుకొని పయనించటంలో ప్రత్యేకతను ప్రదర్శిస్తాడు. వచన కవితోద్యమ పితామహుడు కుందుర్తిలోని ఉద్యమస్ఫూర్తిని, విహారి పద చిత్ర నిర్మాణ ప్రతిభనీ పుణికి పుచ్చుకొన్న కవి డా॥ జి.వి. పూర్ణచందు.

భావచిత్రాలు పాఠకులకు ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. ఆలోచనల సారాన్ని దర్శింపచెయ్యటమే భావచిత్రం. ఇక్కడ పాఠకుడు కవితో పాటు ఆలోచించగలగాలి. కవిభావాన్ని పట్టుకోగలగాలి. ఒక్కోసారి కవికన్నా ముందుకు వెళ్ళి పాఠకుడు కొత్తకోణాలను దర్శించే అవకాశం కూడా ఏర్పడుతుంది.

ఒకరు వేసిన దారిన కాకుండా తనకంటూ ఒక బాటను ఏర్పాటు చేసుకొనే ప్రత్యేకత డా॥ జి.వి. పూర్ణచందుగారిది. ఆధునిక కవిత్వాన్ని బాగా వంటబట్టించు కోవటంవల్ల ఏ కవి ఏ విధంగా చెప్పాడో ఇట్టే గ్రహించగలిగే జ్ఞానం, జ్ఞాపకం, అవగాహనలు డా॥ పూర్ణచందు సొంతాలు. అందుకే ఒక కొత్త భావమార్గంలో నడిచాడు. నూతన భావచిత్రాలు గీశాడు. స్వయంగా చిత్రకారుడు కావటం ఇందుకు దోహదపడింది.

"మదిలో / నదీ ప్రవాహం.../ ఆలోచనల / తలుపులు తెరుచుకుని / సాగిపోతూ / ఉదయ బింబం... / అనుసరిస్తూ అలల పరివారం / గమ్యం- / జనసముద్రంలోకే!"

చిక్కని చక్కని భావచిత్రాన్ని ఇక్కడ కవి ఆవిష్కరించారు. నదిఒడ్డున నిలబడి నప్పుడు ఉదయిస్తున్న సూర్యుడు తలుపులు తెరుచుకొని వస్తున్నట్లుగా కనిపిస్తాడు. ఆ సూర్యుడు మెల్లమెల్లగా సాగిపోతూ వుంటే అలల పరివారం అనుసరిస్తున్నదని చెప్పటం ఒక వినూత్న భావన. ఇక్కడ మదిలో నదీ ప్రవాహం అనటం ద్వారా

మనసులోని ఆలోచనా స్రవంతిని కవి స్ఫురింపచేశారు. ఉదయబింబం కవికి ప్రతీక. సూర్యుడు చీకట్లను పారదోలి వెలుగుల్ని నింపుతాడు. కవి స్తబ్దతను తొలగించి చైతన్యాన్ని రగిలిస్తాడు. సూర్యుడు మహా సముద్రంలోకి పయనిస్తాడు. అలాగే "కవి సూర్యుడు" జన సముద్రంలోకి వెళతాడు. ప్రజల సమస్యల్ని తన కవితల్లో ప్రతిబింబింపచేస్తాడు. ప్రజల్ని కదిలిస్తాడు. కవ్విస్తాడు. కదం తొక్కిస్తాడు. ప్రజా ప్రతినిధి కాగలిగినవాడే కవి అవుతాడని ఈ కవితలో ధ్వని. ఇదీ భావ చిత్రధ్వని!

"ఈ అన్నంగిన్నె- / నాకు / అర్ధ భూగోళం"

"ఆకాశగంగలో / స్నానం ఆడుతూ / భూమిని / ఆనందంగా చూస్తున్నాడు సూర్యుడు..."

"నూతిలోంచి / కడవలోకి / ధారాపాతంగా / నేను..."

"నీరూ, నేలా / ఆలిగనంలోంచే / లోకం పాపాయి..."

"నది- / ఇరుగట్టుల / మడత మంచం మీద / చీకటి దుప్పటి కప్పుకుని / శేషతల్ప శయనంలా..."

ఇలాంటి అనేక కవితలు ఈ వెలుగురాగాల సంకలనంలో భావచిత్రాలను ధ్వనింపజేస్తున్నాయి. ఒక ఆలోచనల ఒరవడిలో పడి పాఠకుడు సుదూర తీరాలకు వెళ్ళిపోతూంటాడు! అదీ భావ చిత్రధ్వని సాధించే ప్రయోజనం!

వాదాల భేదాల నీడలేవీ ప్రసరించని వెలుగురాగాలివి. డా॥ పూర్ణచందు నిరంతంతర అధ్యయనశీలి. వందపేజీలు చదివి ఒక్క పేజీ రాయాలనే నిబద్ధత వున్నవాడు. ఆ ఒక్కపేజీలోనూ తనదైన ముద్ర వుండాలనుకొంటాడు. తన గొంతే వినిపించాలనుకొంటాడు. ముద్రను పాఠకుల హృదయాలపై చెరగని, తరగని, నలగని రీతిలో అచ్చొత్తుతాడనటానికి వెలుగు రాగాలలోని కవితలే నిర్శనం. మచ్చుకు  వీటిని పరిశీలించండి...

"రెండు తీరాలను / వేరుచేసి చూపిస్తుంది / వంతెన / తీరాల దూరాలను / చేతులు బారజాపి/ కొలిచి చూపిస్తుంది / వంతెన/ భిన్నత్వంలో ఏకత్వానికి / సాక్షినంటుంది / ఏకత్వంలో భిన్నత్వాన్ని చాటి చెప్తుంది / వంతెనది / సంస్కర్త హృదయం /"

"కరిగే కొద్దీ / కాలం / మామిడికాయ తరుగే / మిగిలిన టెంక / ఈ జీవితం / చుట్టూ పెరిగిందంతా / పై మెరుగే !"

దండేనికి దండాలు / ఉతికింది 'వాడయినా / ఆరేసేది తాను కాబట్టి... దండెంమీద వుంటే / ఈ చొక్కా / ఎగరేసిన జెండాయే/ దింపేయగానే మడిచి

ఇస్త్రీ అయి / బీరువాలో జీవిత ఖైదీ / దండెంమీది / బతుకే / స్వేచ్ఛ."

మనిషి జీవితం వైవిధ్య భరితం. జీవితంలోని ఆటుపోట్లు, కష్టసుఖాలు, తాత్త్వికచింతనలెన్నో ఈ కవితా సంపుటిలో తొంగిచూస్తున్నాయి.

ఆధునిక జీవితంతో పెనవేసుకుపోయిన కంప్యూటర్‌నీ కవితా వస్తువుగా స్వీకరించి జీవితానికి అన్వయించేసినతీరు అపూర్వంగా వుంది. అతి నూతనంగా వుంది. ఆలోచనాత్మకంగా వుంది. ప్రస్తుత సమాజంలో జనజీవితాన్ని ప్రభావితం చేసే ఎలక్ట్రానిక్ మీడియాపై చురుకైన విసుర్లూ వున్నాయి–

ఇక్కడ ప్రత్యేకంగా చెప్పుకోవలసింది తాత్త్వికత గురించి...

'వెలుగు రాగాలు' కవితా సంపుటిలో కవి ప్రదర్శించిన తాత్త్విక ధోరణి కొత్తదనం నిండివుంది. భావ పరిమళం ధ్వన్యాత్మక ప్రబోధం జనహితాన్ని కోరే లక్ష్యం గుది గుచ్చి కన్పిస్తుంది–

"నిన్నటివరకూ / బతుకు / పూర్వజన్మ సుకృతం / రేపటినుంచీ / మరణం / మళ్ళీ జన్మకు పునాది /

నేడనేది / నాదనేలోగా / కాలకింకరులు / రేపట్లోకి తోలేస్తారు /

పుట్టుక / చావుల / సంధికాలంలోనే / సంధించాలీ / ఆయుధాన్ని!"

అనే కవితలో చెప్పిన ఆయుధం మనిషి జీవితమే! అది పదునెక్కి వుండాలని కవి ప్రబోధ ధ్వని.

"నీకైతే స్మశానం– నాకైతే జన్మభూమి" కవిత మార్మికవాదపు నీడలు పరుచుకుని, ఆలోచనల వెలుగురాగాలను ఆలపిస్తూంది!

"ఉయ్యాల కెందుకో / అంత / వయ్యారం? ఊపుమీదుంటే / ముందుకెళ్ళినా గొప్పే! వెనక్కి వెళ్ళినా గొప్పే...

ఊపాగిందంటే / ఊపిరాగినట్టు / వ్రేలాడపడుతుంది...
ఊపిన 'వాడి'దేగాని / ఊపు / తనది కాదని/ తెలియకే!"

ఈ కవితను చదివితే "ఉయ్యాల రాజకీయ నాయకుడు. ఊపేవాడు ఓటరు" అనీ "ఉయ్యాల సామాన్యుడు, ఊపేది డబ్బు" అనీ, "ఉయ్యాల జీవుడు, ఊపేవాడు దేవుడు" అనీ పరిపరి విధాల ఆలోచనలు వస్తాయి... పాఠకుడి మనోరీతిని బట్టి!

"నూతిలోంచి / కడవలోకి / ధారాపాతంగా నేను/ కడవనిండిందంటే / మోసుకు పోయేవాళ్ళు / వచ్చేస్తారు / ఏ నేలనో తడపాలని / నన్ను గుమ్మరిస్తారు.../ ఏ బీజాన్నో మొలకిస్తానని! /నేలలోంచి / మళ్ళీ నేలమీదకి / నేలమీంచి / మళ్ళీ నేలలోకి / నడకే గదా / జీవన చక్రం

–ఈ కవితను చదవగానే ఆదిశకంరాచార్యులవారి 'పునరపి జననం / పునరపి మరణం' శ్లోకం గుర్తుకు వస్తుంది. అయితే కవికున్న సామాజిక దృష్టికోణాన్ని బట్టి చూస్తే కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి. ఇక్కడ 'నేను' అనేది 'నీటికి ప్రతీక.' దాని విలువ దానిది. నేలలోంచి నేలమీదికి, నేలమీదనుంచి నేలలోకి నీటి జీవనచక్రం సాగుతున్న వైనం కన్పిస్తుంది. నీటిని సద్వినియోగం చేసుకోవాలనే తాత్త్విక, సాత్త్విక, సామాజిక ప్రబోధధ్వని వినిపిస్తుంది. సరిగ్గా ఇదే ధోరణిలో– "డ్రా' చేస్తే / బ్యాంకునించి బైటకి.../ ఖర్చు చేస్తే / బైటనుంచి మార్కెట్టుకి / దాచేస్తే / తిరిగి బ్యాంకుకి / చేతులే మార్పు / డబ్బు/ నిత్యం" అనే కవితలో జనస్వామ్యాన్ని ధనస్వామ్యం నడుపుతున్న తీరు ద్యోతకమౌతోంది!

అన్ని కవితలూ ఇలా ఉటకించుకుంటూ వెళ్ళే సాహసం చెయ్యనుగానీ...

పూవుతల్లి
కాన్పు తెలుసా?

పూవులో విరిసిన
పరాగరేణువు తెలుసా?
రేణువు బీజమై
మొలకించిన
అనురాగ కణాలు తెలుసా?
అనుబంధాలకు
మూలాలు తెలుసా?

మానవ సంబంధాలంటే
'మమత'ల కలనేత!

లాంటి చిరంతనమైన చితి, చింత, చింతనలను నిరంతరమైన అవ్యాజ, అనురాగ బంధాలను, హృదంతరమైన జనసౌజన్య పరిమళాలను వెదజల్లే కవితలను ప్రసరింపచెయ్యగల "ప్రతిభా కవి పూర్ణచంద్రుడు" డా॥ జి.వి.కి ఇంతకన్నా ఏమివ్వగలను...? నా ఆత్మీయ మిత్రునికి ఇవి అక్షరాభినందనలు!

– డాక్టర్ గుమ్మా సాంబశివరావు



# 1

ఆలోచనల
ఏకులు వడికి...
వెన్నెల దారాలను
వేకువ ఆకాశం
రంగుల్లో తడిపి...
లోకానికి
'వెలుతురు కవిత'
నేస్తున్నాను-
చీకటిలో
దీపంలా
సూరీడు...
ఎర్రగా నవ్వుతూ!

# 2



ఊహాల
ప్రమిదలో
ఆశల సముద్రం
నింపి
అనుభవాల
దీపం వెలిగిస్తున్నా...
అనుభూతులదే
వెలుగంతా!

# 3

ప్రమిదలోంచి
'వత్తి'లోకి...
మెదడులోంచి
మనసులోకి...

నదిలోంచి
కావడిలోకి...
మదిలోంచి
కాగితంలోకి...

కోటలోంచి
జనంలోకి...
మాటలోంచి
చేతలోకి...

చేరిందే దీపం!



# 4

మనసు...
గంధపు చెక్క!

మనిషి...
రాయైనా
గంధపు సాన!

స్నేహహస్తాలతో
అరగదీస్తే
లోకానికి
పరిమళం!

## 5

పై మెరుగులతో
పరిగెడితే
పై మెట్టులో శివుడు...
నీకన్నా
ముందే వుంటానని
హెచ్చరికగా!

ధీమా సడలి
దిగజారితే
దిగువమెట్టునా శివుడు...
నీతోనే వుంటానని
వాత్సల్యంగా!

ఆశలన్నీ ఉడిగి
అక్కడే ఆగితే
నిట్టనిలువుగా శివుడు...
ఆగినా కదిలే
చైతన్యంగా!



## 6

కత్తితో
కోయలేనిది...
నిప్పులో
కాల్చలేనిది...
నీళ్ళతో ముంచెత్తినా
నాన్చలేనిది...
ఆత్మ!
దానినెత్తికెక్కి
క్షోభ పెట్టగలడు
భర్త!

# 7

ప్రవహించే
ఆలోచనల మీద
పరుచుకున్న
నా నీడ...
అనంత యాత్రికుడు!

ఎండిన మెదళ్ళను
తడిపి
పండిన చేనుమీద
పరుచుకున్న
నా నీడ
అనంత స్వాప్నికుడు!

నేను-
ఆకాశపు ఓడుని...!



# 8

మదిలో
నదీ ప్రవాహం...

ఆలోచనల
తలుపులు తెరుచుకుని
సాగిపోతూ
ఉదయబింబం...

అనుసరిస్తూ
అలల పరివారం...

గమ్యం-
జన సముద్రంలోకే!

# 9



గుప్పెడంత
గుండెకు
అప్పడెట్లిచ్చాడో
కొండ నిబ్బరం...

తిప్పలన్నీ
శరీరానికే...
అయినా-
ఎప్పటికీ
మిగిలే కీర్తి
గుండెదే...!

# 10

సరుకుల్ని
తయారుచేసి
వాటికి
మనుషుల్ని అమ్మటమే
మార్కెటింగ్!

మన
అవసరాల కోసం
సరుకులుండవింక!

సరుకులకోసం
అవసరాల మార్పు
ప్రపంచీకరణం తీర్పు!!

# 11

చీమలు పెట్టిన
పుట్టలు
పాములకే అన్నట్టు...
పామరులు
కట్టిన పాటలు
సినిమా
స్వాముల చేతుల్లో
గాసటబీసటలౌతాయి!

పాటకు,
పాటలో మాటకు
'కాపీ'
రైటే !



# 12

వాడు-
తన డబ్బుతో తాగి
తన గుడ్డలు
చించుకుంటాడు

వీడు-
జనం డబ్బుతో తాగి
జనం గుడ్డలు
చించుతాడు!

మొరటోడైనా
మొదటోడే
తక్కువ శత్రువు!

# 13

రెండు తీరాలను
వేరు చేసి చూపిస్తుంది
వంతెన!

తీరాల దూరాలను
చేతులు బారజాపి
కొలిచి చూపిస్తుంది
వంతెన!

భిన్నత్వంలో ఏకత్వానికి
సాక్షినంటుంది-

ఏకత్వంలో భిన్నత్వాన్ని
చాటి చెప్తుంది-

వంతెనది
సంస్కర్త హృదయం!



# 14

ఒక కృష్ణుడు
ఒక బుద్ధుడు
ఒక క్రీస్తు
ఒక మహమ్మదు
ఎవరి మతం వారిది...
మనుషుల్ని
విడగొట్టుకొంటూ!

ఒక పండు
ఒక పువ్వు
ఒక నది
ఒక ఉషస్సు
ఎవరి ధర్మం వారిది...
మనుషులకోసమే
పనిగట్టుకొంటూ!

# 15

దోమతెరకి
ప్రాంతీయ తత్త్వం జాస్తి!
బైట దోమల్ని
లోపలికి రానీయదు...
లోపలి దోమల్ని
బైటకు పోనీయదు...

మధ్యలో దూరేడంటూ
నామీద
లోపలి దోమలదాడి...

ఈ 'పక్క'
నాది
కాదా?



# 16

గుడిసెలు
తగలబడుతున్నప్పుడు
గుడిలో అభిషేకాలా?

మడిచేలు
ఎండుతున్నప్పుడు
వరుణ యాగాలా?

పూలు
శివలింగాలకు పూస్తాయా?

చేలు
బలిదానాలకు తడుస్తాయా?

కష్టాన్ని
నమ్ముకున్నవాడి
ఇష్టాన్ని కోరుతుంది...
ప్రకృతి!

# 17

ప్రొద్దున్నే
మెడపట్టి
శిరచ్ఛేదనం చేస్తావు...

మధ్యాహ్నం
కొనవూపిరి
ఆగిపోయి మరణిస్తుంది...

సాయంత్రానికి
దిక్కుమాలిన శవాన్ని
రోడ్డుమీద పారేస్తావు...

అయినా-
పువ్వు పూస్తూనే వుంటుంది
నవ్వు రువ్వుతూనే వుంటుంది...



# 18

గుప్పెట
తెరిస్తే
రహస్యం బైటపడ్తుంది!

గుప్పెట
బిగిస్తే
బ్రహ్మాండం బద్దలౌతుంది

చేతికే
సంకెళ్ళు
అందుకే!

# 19

రాజ్యాంగం
రుబ్బురోలు!

న్యాయస్థానాలు
రుబ్బుడు పాత్రలు!

నానబెట్టిన
సమస్యల పప్పు
నలగాలంటే,
ఈ రెండింటికీ
'కక్కు' కొట్టించాలి!

(కక్కు : బాగా పదును
పెట్టేందుకు గరుకు చేయటం)



# 20

ఈ కత్తి
ఒరలో వుంటేనే
అందం...

ఈ తుపాకీ
గోడకి వ్రేలాడితేనే
మేలు...

ఈ కాముకుడు
'రాజభవన్'లో వుంటేనే
క్షేమం...

ఊరుమీద పడితే
మానహరణమే!



## 21

కలువ కన్నులకూ
వెన్నెలకూ మధ్య
విలువలేని శూన్యంలో
నిలువలేని తనమే
విరహం!

అది-
కలవలేనప్పుడు
తియ్యగా వుంటుంది

కలిసిందంతా
చీకటే!

# 22

తలకూ
గడ్డానికీ
రంగేసుకొచ్చి
స్వామిజీ...
దేహంపై మోహం
దేనికంటాడు!

శ్రోతలారా...

వేత్తలు
చేసింది కాదు,
చెప్పిందే
చెయ్యండి!!

# 23





శరీరం కంప్యూటర్లో
మెదడు-
హార్డ్ వేర్...

మనసు-
సాఫ్ట్‌వేర్...

జీవితం డాక్యుమెంట్లోంచి
పాత అనుభూతిని
'కట్' చేసి...
కొత్త ఫైల్‌మీద
'పేస్ట్' చేసి...
అనుభవాలను
'ఎడిట్' చేస్తూ...
మనిషి!

# 24

గింజ నాకు వారసత్వం
చక్కగా మొలకించు స్వామీ...
దేవుణ్ణి మొక్కింది
తల్లి చెట్టు!

స్వేచ్ఛ నాకు ముఖ్యం
చెట్టు అడ్డు తొలగించు స్వామీ...
దేవుణ్ణి మొక్కింది
పిల్లమొక్క!

ఎదిగాక
అమ్మ అడ్డే!

## 25



ఆ గది
మూగదే...
నే పుట్టేవరకూ!

ఆగని వేదనలెన్ని
దిగమింగుకున్నదో...

పొత్తిళ్ళ ఉయ్యాలలో
ఊగిన 'ఆశ'
నేనే!

కేరింతలు
నావే!

మూ'గది'
వాగరయ్యింది!

# 26

ఆస్తులు
రాయనోళ్ళకీ
దాచెట్టిన నిధులు
ఆస్తుల్లో చూపనోళ్లకీ
వంశవ్యాధులు
ఆస్తుల్లా చాపినోళ్ళకీ
ఆశ్రిత బంధువులు
ఆక్రోశిస్తూ
పెట్టేదే
తద్దినం!

# 27

బంగారం
సింహాసనం
ఎక్కించావని
పొంగిపోయి,
వెనకటి గుణం
ఏమారుస్తానా...?

జాతిలక్షణం
మరిచి
దొంగాడికి
తోకాడిస్తానా...?
మ
ని
షి...?



# 28

చెకుముకి రాళ్ళు
దారులు చెప్తాయా...?

మిణుగురులు
దారులు చూపుతాయా...?

పై మెరుగులు
దారులు వేస్తాయా...?

చెదిరిన ఆర్తనాదాన్ని
మూగ వెలుగులు
ఏమారుస్తాయా...?

గుండెకాగడా వెలిగితే
చీకట్లు బిదుముతాయి!



## 29

బోధి
నీడ పట్టున
వెదక్కు...

జనం
నాడి పట్టి
చూడు
జ్ఞానీ...!

# 30

పైన
సీలింగు ఫ్యాను...
రెక్కలాడించి
గాలి పోగేస్తూ...

వార్తా ఛానళ్ళు
వార్తలు పోగేసినట్టే!

ఇది
చెమటను ఆరుస్తుంది...

అవి
చెమటలు పట్టిస్తాయి!

# 31



ప్రేమించానని
వెంటాడే కుర్రాడు...
ప్రేమను
ఆరాధించాలని
తెలీని పైరోడు!
కామించినా
సీతను తాకాడా
ఆ
రావణ్ణు...?
ఏమొచ్చి వీడు-
ముఖాన యాసిడు
పోసి-
పోయిన్డు??

# 32

చిలకెగిరిపోయింది!

అయినా,

దింపుడు కళ్ళెం ఆశ...

ఎదురేగి

తెస్తారా ప్రాణం...?

వస్తుందేమో... ఆశ

ఇగిరిన

దీపం వాసనే

ఆశ! ఆశ! ఆశ!

# 33



నాగేటి చాలులో
దాగేటి సీతల్లారా...
దాటని గీతల్లారా...
చట్టాలున్నా
చెలరేగని
ఇతిహాసపు చీకటి
శకుంతల్లారా...
'ఇంటి హింస'కు
ఇల్లెక్కి చాటటమే
అసలు దారి!

# 34

హక్కుల పోరాటం
యుగధర్మం...

మొక్కలిరుగుతాయి
చెక్కొక్కటి తగ్గితే!

బాధ్యత
లేనివాడినంటావా...?

హక్కులడగటమేరా
బాధ్యత!

## 35



నా మనవరాలు
నన్ను తాతని చేసింది...
గీత పక్కన చిన్నగీత
గీతని పెద్దది చేస్తూ!

నా పక్కన మా అమ్మ...
నన్ను చిన్నవాణ్ణి చేసింది
గీతపక్కన పెద్దగీత
గీతని చిన్నది చేస్తూ...

నేను-
చెరగని గీతనే
ఎప్పటికీ!

# 36

ఈ
అన్నం గిన్నె
నాకు
అర్థ భూగోళం...

గంజి కాచుకున్నా
సంకటి వండుకున్నా
భూగర్భ నిధులన్నీ
నావేనన్నంత
సంబరం...!

గిన్నెలోని
పరమార్థం నాదే...

గిన్నెకు
రారాజును నేనే...



## 37

కరిగే కొద్దీ
కాలం
మామిడికాయ తరుగే!

మిగిలిన టెంక
ఈ జీవితం!

చుట్టూ
పెరిగిందంతా
పై మెరుగే!

# 38

వరి పొలాన్ని
చూసి
సిరినవ్వుల్ని
వినలేని
దొరలు దేనికి?

అరకే
దండగన్న
'వాణ్ణి'
'ఊరి'కి పంపటమే
రైతు ప్రగతి!

# 39

Air కి repair
అవసరం అయ్యింది-
Fire పుట్టి wire లో
కొంపలు కాల్చింది-
water ని wanted అని
ప్రకటించారు-
Earth మీద stethe పెట్టి వింటే,
ఏ స్పందనా లేదు-
Space లో race లెక్కువై
రాకెట్లు గుర్రాలౌతున్నాయి-
ఈ Punch "భూతాలకు"
గట్టిగా తగిలిస్తేనే
'లోకశాంతి'!

# 40

కచ్చేప్పమంతేనూ
మళ్లొచ్చేస్తానని
మా 'అంమ'
తీపి చూత్తూ చూత్తూ
బల్లున ఏడుత్తుంటే,
స్విచ్చాపి
సీక్చలైపోచ్చని
నవ్వేచా...
'చందమామ'ని
చూపించమ్మా!

# 41

ఇంత
వెగటు
ఇంక చూడలేక
రాతిముంతలో,
'నాటు మాంసం' ముక్కలు
తినేటంత
ఆది మానవుడే
యొక్కంటాడేమో...

ఈ టీవీ
అమ్మేస్తే
మంచి పుస్తకాలొస్తాయి!



# 42

దేవుడికి
రాతి బొమ్మ రూపు!

కారడవిలో కోతికి
మనిషి రూపు!

దానవ నియంత
జనస్వామ్యానికి రూపు!

చూపు లేకపోతే
రూపులదే
నేడు...
రేపు...

# 43

ఖంగున మోగుతాను...
రాజకీయాల్లో కొచ్చిన
హీరోని!

ఠింగున మెరుస్తాను...
తళతళలాడే
సినీ తారని!

టంగున తెగకుండా
గట్టిగా నిలుస్తాను...
కులం నేతని కూడా!

అయినా ఓటెయ్యలేదేం?

కంచుతో
నగలు చేయిస్తారా
మాష్టారూ...?



## 44

మేక
పులిగా మారితే
లోకానికి మంచిదే...
మాంసాహారం
మనుషులకు
ఇంక చవక!

పులి
మేకగా మారితేనే
మనిషికి నష్టం!

శాకాహారం తెచ్చి
మేపలేక చస్తాడు!









## 45

పూవుతల్లి
కాన్పు తెలుసా?

పూవులో విరిసిన
పరాగరేణువు తెలుసా?

రేణువు బీజమై
మొలకించిన
అనురాగ కణాలు తెలుసా?

అనుబంధాలకు
మూలాలు తెలుసా?

మానవ సంబంధాలంటే
'మమత'ల కలనేత!

## 46

పరమాత్ముడి
మిఠాయి దుకాణంలో
మనుషులు
అమ్మకం సరుకులు!

దేవతలూ గంధర్వులూ
కొనుగోలుదారులు!

వాలిన ఈగలు
దాగిన ఎలుకలే
మాఫియాలు!

ఉపేక్షిస్తే
సరుకు మాయం...

నష్టం
యజమానికే!

## 47

ఆకాశ గంగలో
స్నానం ఆడుతూ
భూమిని
ఆనందంగా చూస్తున్నాడు
సూరీడు...

తన కిరణాల
అధికార గణాలు
అవతలివైపు
చీకటినే
మిగిలిస్తున్నాయని
తెలియని
పాలకుడిలా!



# 48

నూతిలోంచి
కడవలోకి
ధారాపాతంగా నేను...

కడవ నిండిందంటే
మోసుకు పోయేవాళ్ళు
వచ్చేస్తారు...

ఏ నేలనో తడపాలని
నన్ను గుమ్మరిస్తారు...
ఏ బీజాన్నో మొలకిస్తానని!

నేలలోంచి
నేలమీదకి...
నేలమీంచి
నేలలోకి...
నడకే గదా జీవనచక్రం!




## 49

మట్టినించి
మింటికెగరాలనే!
గట్టి ఊపొచ్చేలోగా
తట్టినా లేవని
పెన్నిద్ర పట్టి
మట్టిలోకే
జారిపోతారు!

ఇక్కడ మిగిలిందే
కీర్తి!

# 50

పళ్ళెం
మనకేమిచ్చిందని కాదు...
పళ్ళానికి
మనం-
ఏమిచ్చామన్నది
ముఖ్యం!

పళ్ళెం మనకోసం పుట్టిందా?

అది నిండాలని
మనమే
అగచాట్లు పడ్తోన్నాం!

పళ్ళెం అయినా
దేశం అయినా
మనం
ఎంత ఇస్తే
మనకి అంత ఇస్తాయి!!

## 51



ముప్పయి మూడుకోట్ల
దేవతలకూ
ముప్పొద్దులా
కావలికాసే
పెద్ద జే జే...

ఏ ముప్పు ముంచెత్తినా
మా తిప్పలు మావేగా!...

నైవేద్యాలు మావి
కాపలాలు వాళ్ళకా...?

## 52

బొటనవేలు
గూండా!

చూపుడు వేలు
వదరుబోతు!

మధ్యవేలు
తటస్థం!

ఉంగరం వేలు
దండుకోవటం!

చిటికెన వేలు
పలాయనం!

అన్నీ కలిసిన 1/2 చెయ్యి
వైకుంఠం...

జనాన్ని
ఆడుకొంటూ...
వాడుకొంటూ...



## 53

ఉయ్యాల కెందుకో
అంత
వయ్యారం...?

ఊపుమీదుంటే
ముందుకెళ్లినా గొప్ప...
వెనక్కి వెళ్లినా గొప్ప...

ఊపాగిందంటే
ఊపిరాగినట్టు
ప్రేలాడ పడుతుంది...

ఊపిన 'వాడి'దే గాని
'ఊపు'
తనది కాదని
తెలియకే...!

## 54

నడిపొద్దున శవాన్ని
బల్లమీంచి దించి
అంత్యక్రియలు జరిపారు...
బల్లంతా కలరా ఉండలవాసన!

మధ్యాన్నాన పెళ్ళివిందుకు
బల్లని తరలించి
వడ్డనలు చేశారు...
బల్లంతా ఊరగాయ వాసన!

సాయంత్రాన సన్మానసభకు
బల్లని వేదికెక్కించి
పూలదుప్పటి అలంకరించారు...
బల్లంతా గులాబీల వాసన!

దృశ్యం మారినా
"వాసన" మారినా
మోత మారునా...?
జన్మకైనా...
బల్లకైనా...

## 55

హైద్రాబాదులో
సముద్రం
వానొచ్చిన రోజొస్తుంది!

కదిలితే
మాన్‌హోల్ తిమింగలం
మింగేస్తుంది!

కదలకపోతే
ఉప్పెనై లేచి
"పై వంతెన"ని
కూల్చేస్తుంది!

మనుషులే
కెరటాలక్కడ!



## 56

నీరూ, నేలా
ఆలింగనంలోంచే
లోకం పాపాయి...

వెలుతురు కిరణాలు
మేధస్సును కూరితే
వాయు తరంగాలు
ఊపిరులూదాయి...

ఆకాశం
దాని పుట్టిల్లు...

ఆవేశం
దాని గుప్పిళ్ళు...





## 57

వాకిట్లో
వేచి వున్న భార్య...

పెంజీకటి కావల
పేకాటలో భర్త...

ఆకలికాగలేక
కేకలకూనలు...

చీకటిని నంజుకుంటూ
కాళరాత్రి...

పెన్నిద్రలో
మా
'లోకం'

# 58

నా దేశం
సువిశాలం...
అంగుళం నేల వంద!

నా దేశం
సుజలాం...
బిందెడు నీళ్ళు వంద!

నా దేశం
సుఫలాం...
కిలో పప్పు వంద!

"వందే
మా
తరం..."

## 59

జట్టులోంచి
ఔటయిన ఆటగాళ్ళలా
జట్టు-
'బహువచనం' లోంచి
ఒక్కొక్కటే రాలి
'ఏకవచనం'లోకి
మారిపోతుంటే
అట్టే పెట్టగలదేది
లేదనే
'నిర్వచనం'
పుట్టింది!!



# 60

ఈ
మాంగల్య సూత్రమే
నేనున్నానని
గుర్తు...!

మాంత్రికుడి ప్రాణం
చిలకలో వున్నట్టు...

మెడలోనే
భద్రంగా వుంచు
నూరేళ్ళూ ఇలాగే!

ఇల్లాలూ...

నే బతికుండాలిగా!!



## 61

నీకైతే స్మశానం...
నాకైతే జన్మభూమి!

నువ్వుపోతే
మళ్ళీ వస్తావేమోనని
భూస్థాపితం చేసి
సమాధి కడతారు!

నేను వస్తే
మళ్ళీ పోతానేమోనని
ఉయ్యాలలో వేసి
ఆలించి లాలించి పాలిస్తారు!

రాకెవరిదో... పోకెవరిదో...

పోయి వచ్చింది
వచ్చిపోయింది
బయల్దేరిన చోటుకి
తిరిగి చేరింది
నేనే...!
నేను- 'జీవకణాన్ని'!

# 62

చొక్కా తీసి
చొక్కా వేసుకున్నంత
తేలిగ్గా
రాత్రికి రాత్రే
బిల్‌గేట్స్‌ని
మించిపోవాలంటారు
వ్యక్తిత్వ వికాస నిపుణులు...

చెప్పినవాడెవడైనా
మించాడా...?

కృషి ఏది సారూ...??

# 63

పెళ్ళను పెకిలించుకుని
మొలకలొచ్చినట్లు
సమాధి రాళ్ళను
తన్నుకుని
మనుషులొస్తారా...?

రానివాళ్ళంతా
ఆనవాళ్ళయి
వెన్నాడి తిరుగుతారా...?

గాంధీజయంతికి
శలవు
అందుకేనేమో!



## 64

'డ్రా' చేస్తే
బ్యాంకునించి బైటకి...

ఖర్చు చేస్తే
బైటనుంచి మార్కెట్టుకి...

దాచేస్తే
తిరిగి బ్యాంకుకి...

చేతులే మార్పు-

'డబ్బు'
నిత్యం!



## 65

గుండె...
మహావృక్షానికి
వేలాడే
తేనెతుట్టె!

మెదడు...
గోడమీద
నిద్రపోయే
కేలెండరు!

మనసు...
గుమ్మాన్ని
కరుచుకున్న
తలుపు గొళ్లెం!

అణువిస్ఫోటనం
జరిగినా
చలించని
శరీరం!!

## 66

నిన్నటి వరకూ
బతుకు
పూర్వజన్మ సుకృతం!

రేపటినుంచీ
మరణం-
మళ్లీ జన్మకు పునాది!

నేడనేది నాదనేలోగా
కాలకింకరులు
రేపట్లోకి తోలేస్తారు!

పుట్టుక
చావుల
సంధికాలంలోనే
సంధించాలి
ఆయుధాన్ని!

# 67

రాగలత
పూసీ పూయగానే
తేనెగ
వాసన చూసినట్టు

మూగ కలమేదో
మురిపానికి రాసినా
ఆగకంటూ
ఆపకంటూ
నడిపించే
రహదారి...

మా
"విహారి!"
శ్రీ విహారి పదచిత్ర రామాయణ కర్త,
ప్రసిద్ధ కథారచయిత, విమర్శకుడు.



## 68

దీపం లేక
ఇల్లు
బూజుపట్టినట్టు-
చంద్రుడు రాక
ఆకాశం
నల్లబడ్డట్టు-
నైవేద్యం లేక
గుడి
పాడుబడ్డట్టు-
పేపర్లో పేర్రానిరోజ
బావురుమంటుంది
నాయకుడి
గుండె!

# 69

ముంగిట ముత్యంలా
ఇంట్లో
ఇంటర్నెట్టొక
వింతవల!

క''రెంటొ''క్కటే ఖర్చు...

వెంటాడినకొద్దీ
వేలపేజీల సమాచారం...

అరచేతిలో
భూగోళం
అమరినట్లు!





## 70

పుట్టాడనగానే
మంచం మీదకు
చేర్చేస్తారు...

మరణిస్తున్నాడనగానే
మంచంమీంచి
దించేస్తారు...

పుట్టుకకీ చావుకీ
మధ్య
రహదారి
ఈ మంచం...

అలంకరించుకుంటేనే
శోభనం!

## 71

హృదయం...
మంచుముక్క!

మనసు తాపానికి
కరిగి
వేదనల నదిగా
కదిలి
సమస్యల సముద్రంలోకి
దూకుతోంది!

ఏ ఉప్పెన
ఎప్పుడొస్తుందో...

ఈ గుండెకి
కావాలి...
"నిబ్బరం కోల్డ్‌స్టోరేజ్"!



## 72

నది...
ఇరుగట్టుల
మడత మంచంమీద
చీకటి దుప్పటి కప్పుకుని
శేషతల్ప శయనంలా...

నది ఒడ్డున తాడిచెట్టు
నాభిలో పుట్టిన కమలంలా

పైన పద్మాసనంలో
పూర్ణచంద్రుడు
వెలుగు లీనుతూ...

రేపటి చైతన్యానికి
శక్తి నింపుకుంటూ
ప్రకృతి...



## 73

దండేనికి దండాలు!

ఉతికింది 'వాడ'యినా
ఆరేసేది తాను కాబట్టి...

దండెంమీద వుంటే
ఈ చొక్కా
ఎగరేసిన జెండాయే...

దింపేయగానే
మడిచి ఇస్త్రీ అయి
బీరువాలో జీవితఖైదీ...

దండెంమీద
బతుకే
స్వేచ్ఛ!

# 74

కొండకొప్పులో
బంతిపువ్వు
సూరీడు...

పారాణీ కాళ్ళమీద
కుంకుమ రేఖ
కృష్ణమ్మ...

వయ్యారం నడుంమీద
వంకీల వడ్డాణం
ప్రకాశం బ్యారేజీ...

కొండచుట్టూ
అల్లుకున్న ఆదిశేషుడు
బెజవాడ...

ఫణి పడగమీద
వెలుగులీనే మణి-
"భాషోద్యమం"

తెలుగు నేలంతా
పరచుకుంటూ...



భాషా సాహిత్య వైద్య విజ్ఞాన పరిశోధకుడు

# అక్షర జీవి డా॥ జి.వి. పూర్ణచందు

**కొం**తమంది ప్రతిభావంతుల శేముషీకృషీ, అద్రిప్రోన్నతమైన వ్యక్తిత్వం మనచేత అద్భుత రసనిమజ్జనం చేయిస్తాయి.

అలాంటి ఒక బహుముఖీన ధీమంతుడు డా॥ జి.వి. పూర్ణచందు.

52 ఏళ్ళ ఉత్సాహ వంతుడైన యువకుడు. మూడు దశాబ్దాల ఆయుర్వేద పట్టభద్ర వైద్యుడు. 35 ఏళ్ళ సాహిత్య చైతన్య గమనంలో 80కి పైగా గ్రంథ రచనలు సాగించిన సాహితీ భాస్వరుడు పూర్ణచందు.

డా॥ జి.వి. పూర్ణచందు పేరు వినగానే ముప్పయ్యేళ్ళనాటి మినీకవితా ఉద్యమం గుర్తుకొస్తుంది. లక్షలాదిమంది పాఠకులకు మార్గదర్శకంగా నిలుస్తున్న వైద్యరచనలు మదిలో మెదులుతాయి. తెలుగుభాషోద్యమ దీప్తిని కలిగించిన మొదటి ప్రపంచ తెలుగు రచయితల మహాసభల వైభవం కళ్ళలో కదలాడుతుంది. తెలుగు జాతిమూలాలను వెలికితీసి 'తెలుగే ప్రాచీనం' అని నిరూపించిన భాషోద్యమ స్ఫూర్తి స్ఫురిస్తుంది.

సత్యంకోసం పరిశోధన... జ్ఞానానందంకోసం సృజన... మందికోసం సాహిత్య, సాంస్కృతిక, కళా,వైజ్ఞానిక కార్యక్రమ నిర్వహణ... మనిషి ఆరోగ్యం కోసం రచనా వైద్యం... వీటిని తన చోదకశక్తిగా మలుచుకుని, సమాజ కళ్యాణ కాంక్షతో తన రచనల ద్వారా సాహిత్యాన్ని సంపద్వంతం చేస్తున్న ఉన్నత సారస్వతేయుడు జి.వి.!

29వ ఏటనే ఆనాటి ఆం.ప్ర. సాహిత్య అకాడెమీ సభ్యుడిగా ఎన్నికైన పిన్నవయస్కుడాయన!

"అమలిన శృంగారం"వంటి వైజ్ఞానిక గ్రంథాలు, "అలనాటి పట్టణాలు", "బ్రిటిష్‌యుగం", "బుద్ధదేవుడి కథ" లాంటి పరిశోధనా గ్రంథాలు విమర్శకుల పండితుల మన్ననల్ని పొందాయి.

"తెలుగే ప్రాచీనం" గ్రంథంద్వారా డా॥ జి.వి. నిరూపించిన తెలుగుభాష విశిష్టత ప్రాచీనతల ప్రతిపాదనలు జాతీయ ఖ్యాతిని గడించాయి. ఈ గ్రంథాన్ని ఆంధ్రప్రదేశ్ అధికారభాషా సంఘం తెలుగులో ప్రచురించగా రాష్ట్ర హిందీ అకాడెమీ హిందీలో ప్రచురించింది.

"నైలునించి కృష్ణదాకా" గ్రంథాన్ని ద్రావిడ విశ్వ విద్యాలయం ప్రచురించి డా॥ పూర్ణచందు పరిశోధనలకు ఒక సాధికారికతని కల్పించింది.

జి.వి. రాజకీయ చైతన్యం స్ఫురణకు నిదర్శనంగా వెలువడిన వేముల కూర్మయ్య జీవితచరిత్ర "దీన బాంధవుడు", "ముక్కామల నాగభూషణం జీవితచరిత్ర" గ్రంథాలు సాంస్కృతిక అభిమానుల ప్రశంసల్ని పొందాయి.

"సప్తసింధు" చారిత్రక నవలలో... "ఉగ్రనేత్రద్వయంతో అతను ఉరిమిచూస్తే ఇద్దరు సూర్యులు ఒకేసారి ఉదయించినట్టుంది...", "శాంతి పావురాన్ని కాల్చుకు తింటోంది కాలం" "చిన్నగాలికే నేలరాలిన తుమ్మ పూలయ్యారు గాంధారులు" ఇలాంటి వర్ణనలు అంతర్ముఖీనుల్ని చేస్తాయి మనల్ని! ఎప్పుడో 1991లో వెలువడి సాహితీలోకాన్ని విస్మయపరిచింది ఈ నవల. నవ్యమైన పురాణగాథ, నవలాశిల్పంతో ఊర్జితమైన రచనా వైశిష్ట్యం, భావుక భావ్యమానమైన శైలీ ఇవీ ఈ నవల గుణనైశిత్యంలోని రాగం- తానం- పల్లవి.

"చీకటికేం తెలుసు/ వెలుతురులో/ నాదాల్ని విరజిల్లే/ తంతువు లున్నాయని/ లోభులకేం తెలుసు?/ విత్తనాలలో/ నూరేళ్ళు రంజిల్లే/ జీవితాలున్నాయని?"

"పరాగరేణువును/ పువ్వులో నాటితే/ కాయై పండుతుంది/ అనురాగ కణాల్ని/ నెత్తురులో చల్లితే/ ఆర్ద్రహృదయం మొలకిస్తుంది" ఇలాంటి రూపచిత్రాలను/ "కాంతి స్వప్న "దీర్ఘకవితాకావ్యంలో మనం ఎన్నయినా చూడవచ్చు. కవిత్వం- వాక్యాన్ని ఉక్తివైచిత్రిలో పొదిగే రసవిద్య! కవిగా పూర్ణచందు ఆ విద్య అందుకున్న ధీమంతుడు.

మినీకవిత ఒక ఉద్యమరూపం పొందటంలో 1980- ప్రాంతాల్లో పూర్ణచందు పాత్ర ప్రముఖమైంది. కవిగా, చిత్రకారుడుగా, వ్యయ ప్రయాసల భర్తగా ఊరూరా దేశమంతా మినీ కవితా ప్రదర్శనలు నిర్వహించి యువకవులను సమీకరించి ముందుకు ఉరికించాడు.

"కొండ కొప్పులో/ బంతిపువ్వు/ సూరీడు", "నది.../ ఇరుగట్టుల మడత మంచంమీద/ చీకటి దుప్పటి కప్పుకుని శేషతల్ప శయనంలా" "ఊహల ప్రమిదలో/ ఆశల సముద్రం/ నింపి/ అనుభవాల దీపం వెలిగిస్తున్నా" ఇలాంటి రూపచిత్రాలు ఎన్నో 'వెలుగురాగాలు" పేరుతో పూర్ణచందు వెలయించిన కవితా సంపుటిలో సంక్షిప్త శబ్దచిత్రాల్ని ధ్వనిస్తాయి.

అనితరసాధ్యమైన పూర్ణచందు కార్యనిర్వహణా దక్షత గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి. కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షాన నిర్వహించిన 'జాతీయ తెలుగు రచయితల మహాసభలు', మొదటి 'ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు', 'తెలుగు భాష ప్రాచీనత' పైన నిర్వహించిన జాతీయ సదస్సు, 'కృష్ణాజిల్లా చారిత్రక వైభవం'పైన బందరు డచ్ కోటలో ఆర్కియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియావారితో కలిసి నిర్విహించిన సదస్సు... ఇవన్నీ అందుకు సాక్ష్యాలు.

సింధునాగరికతకు సమాంతరంగా ఇనుమును కరిగించగలిగిన ప్రజలు తెలుగునేలమీద కృష్ణానదీపరీవాహక ప్రాంతంలో నివసించినప్పుడు, వారి సంస్కృతి వికాసాలను "కృష్ణాలోయ నాగరికత"గా పిలవాలని కోరుతూ రాష్ట్రంలోని పురావస్తు పరిశోధకుల్ని రప్పించి సదస్సు నిర్వహించి, ఒప్పించిన పూర్ణచందుకు, తెలుగుజాతి మూలాలను వెదికి పట్టుకోవటంలో గల నిబద్ధత స్పష్టం అవుతుంది. చరిత్ర రచనలో తెలుగునేలకు సముచిత ప్రాధ్యాన్యం ఇవ్వాలని, డెక్కన్ భూభాగంలో వెలసిన నాగరికతపై సమగ్ర అధ్యయనం చేయాలంటూ డా॥పూర్ణచందు చేసిన లక్ష్యప్రస్తావన పురావస్తు శాస్త్రవేత్తలను అబ్బురపరిచింది!

తెలుగే ప్రాచీనం అని అనేక చారిత్రాకాధారాలను వెలికితీసి, తెలుగుభాష మూలాలు ఆఫ్రికన్ భాషల్లో కన్పిస్తున్నాయని ఎన్నో పరిశోధనాంశాల ముడిసరుకుని తెచ్చి పరిశోధకులకు అందించినవాడు పూర్ణచందు. "ఆయుర్వేదం చేసుకునేవాడికి చరిత్ర ఎందుకు...?" అంటూ కొందరు పండితులు తొలుత కన్నెర్ర చేసినా అతను లేవనెత్తిన పరిశోధనాంశాలను ఖండించలేకపోవటం, వాటిని దాటి కొత్తవిషయం చేర్చి చెప్పలేకపోవటం గమనార్హం.

భాషాసాహిత్య వైద్య విజ్ఞాన పరిశోధకుడిగా పూర్ణచందు తెలుగువారి ఆహార చరిత్రను తొలిసారిగా గ్రంథస్థం చేసినవాడు. "తరతరాల తెలుగురుచులు", "అలనాటి ఆహారాలు", "భోజనం కథలు"... లాంటి రచనలు చరిత్రవేత్త, వైద్యుడు, వృక్షశాస్త్రజ్ఞుడు, భాషాశాస్త్రవేత్త నలుగురూ కలగలిస్తేగాని రాయలేని గ్రంథాలుగా ప్రశంసలు పొందాయి.

కాగా, పూర్ణచందు జీవన దృక్పథంలోని తాత్త్వికకోణాన్ని ఆవిష్కరించే రచనలు– "రామాయణంలో విశేషాలు", "శ్రీ గీతగోవిందం" గ్రంథానికి మానసోల్లాసవ్యాఖ్య,

"బుద్ధదేవుని కథ" వంటివి వున్నాయి. వీటన్నిటా అతని వైజ్ఞానిక అనుశీలన కన్పిస్తుంది. ఐతిహాసిక కోణంనుంచి విడివడిన చారిత్రక అనుసరణ గోచరిస్తుంది. ఒక తార్కిక జిజ్ఞాస ద్యోతమవుతుంది.

గ్రంథ రచనలో పూర్ణచందు శైలి గురించి ఒక్కమాట చెప్పాలి. ఎంతటి శాస్త్ర సాంకేతిక వైజ్ఞానికాంశాలనయినా, చాలా సరళంగా, సుళువుగా, స్పష్టంగా చెప్పగలనేర్పు వుందతనికి. శ్రోతని ఎదురుగా కూర్చోబెట్టుకుని చెప్తున్నట్లు విషయవివరణని సంభాషణాత్మకం చేయగలడు.

జీవన తాత్త్వికత విషయంలో, రచనా దృక్పథం విషయంలో ఏది ఎంతవరకూ అవసరమో స్పష్టంగా తెలుసుకొన్న వ్యక్తిగా దర్శనమిస్తాడు పూర్ణచందు.

సాటిమనిషి మనుగడని ఆరోగ్యవంతమూ, ఆనందదాయకమూ చేయటానికి తానుగా ఏం చేయగలడో అంతా చేస్తున్న సీరియస్ వైద్యుడు, ఉత్తమ సాహితీపరుడూ పూర్ణచందు. అతడొక కాంతిదర్శి, క్రాంతిదర్శి, చైతన్య పథగామి!! దాదాపు అన్ని ప్రక్రియల్లో బహుముఖీన ప్రతిభా వ్యుత్పత్తుల్ని వెలారుస్తున్న సాహితీ క్రియాశీలి...

తెలుగు భాషోద్యమంలోనూ తెలుగుప్రజల సమైక్యతా ఉద్యమంలోనూ సన్మిత్రులు శ్రీమండలి బుద్ధప్రసాద్‌తో కలిసి సాగుతున్న డా॥పూర్ణచందు ప్రస్థానం మరోచరిత్రకు శ్రీకారం కాగలదని ఆశిస్తున్నాను. ఆశీర్వదిస్తున్నాను!

**-విహారి**

ఆంధ్రప్రభ ఆదివారం 21 జూన్, 2009

## Check List

| | | | |
|---|---|---|---|
| **Book Number** | G.V.P.010107 | **Date** | 20/02/2021 |
| **Front Cover** | yes | **Back Cover** | yes |
| **Blank Pages** | C.P. 97 | | |
| **Missing Pages** | NO | | |
| **Prepared** | shahina | **Scanned** | R. yaueena |
| **BOOK SIZE** | H 8.5 W 5.4 | **Pages** | 101 |